# నమ్మాళ్వార్

రచన :

డాక్టర్ పి. శౌరిరాజన్

ప్రధానసంపాదకుడు :

డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య




ప్రచురణ :

శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, ఐ. ఏ. ఎస్.

కార్యనిర్వహణాధికారి,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

1980

T. T. D. Religious Publications Series No. 68

SRĪNIVĀSA BĀLABHĀRATI - 7
( Children Series )

NAMMĀLVĀR
by : Dr. P. Sowri Rajan

*Chief - Editor :*
Dr. S. B. Raghunadhacharya

Krishna Pushkaram
Roudri, 1980
Copies 10,000

*Published by :*
Sri P. V. R. K. PRASAD, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati

Subsidised Price 0–50

Art : SEELA VEERRAJU

*Printed at :*
Tirumala Tirupati Devasthanams Press, Tirupati.

# మా మాట

చిన్నపిల్లల మనసులు చల్లనైనవి, నిర్మలమైనవి. చక్కగా పెరిగిన పిల్లలు భావిభారతపౌరులై మంచి సభ్యత సంస్కారం పెంచుకొని, తమ కుటుంబానికి, దేశానికి కూడ పేరుప్రతిష్ఠలను సంపాదించి గర్వకారణమౌతారు. మన ఇతిహాసాల్లోని మహాపురుషులు, మహాపతివ్రతలు ఎలాంటివారు, వారంత గొప్పవారెలా అయినారనే విషయం వారికథను చెపుతూ పిల్లలకు తెలియ జేయగలిగితే, దాని ప్రభావం లేతమనస్సులపైన చక్కని సంస్కారముద్రలను వేయగలుగుతుంది. అవి భవిష్యత్తులో వారికెంతగానో ఉపయోగపడతాయి.

ఈ ఉద్దేశ్యంతోనే "శ్రీనివాసబాలభారతి" అనే పుస్తకమాలను తిరుమల తిరుపతి దేవస్థానం ప్రకటిస్తోంది. ఇందులో మన భారతదేశంలో అనేక ఆదర్శాలకు ప్రసిద్ధులైన మహాత్ముల చరిత్రలు చిన్న చిన్న వాక్యాలలో, చక్కని కథాకథనపద్ధతిలో చెప్పడం జరుగుతుంది. చిన్నారి బాలలు వీటిని బాగా ఉపయోగించుకుంటారని ఆశిస్తున్నాం.

వమ్మా. 2

ఈ ప్రణాళికను రూపొందించి, రచనలను తయారుచేయించి, వాటిని కావలసినపద్ధతిలో సంపాదించిన డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య (కో-ఆర్డినేటర్, పబ్లికేషన్స్, టి.టి.డి.) గారికి నా అభినందనలు. ఈ ప్రణాళికలో మాతో సహకరించిన రచయితలకు, కళాకారులకు మా ధన్యవాదాలు.

శ్రీకృష్ణాష్టమి
2-9-1980

పి. వి. ఆర్. కె. ప్రసాద్, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# స్వాగతం !!

శ్రీనివాసదయోద్భూతా బాలానాం స్ఫూర్తిదాయినీ ।
భారతీ జయతాల్లోకే భారతీయగుణోజ్జ్వలా ॥

ఖండ ఖండాంతరాల్లో నాగరికత కన్నువిప్పేవాటికే సభ్యతకు సంస్కారానికి, నైతిక-ధార్మికాదర్శాలకు పేరువడ్డది మన భరతఖండం. ఈ గడ్డపై పుట్టిన ప్రతిమానవుడు అధర్మాన్ని ఎదిరిస్తూ, ధర్మాచరణంలో తన జీవితాన్ని పండించుకొని, మాధవాభిముఖంగా నడచి మహనీయకీర్తి నార్జించినవాడే. అలాంటి మహాత్ముల సన్నిధి మన సుఖ సంతోషాలకు పెన్నిధి. కనీసం వారి జీవితాదర్శాలు మనస్సుల్లో మెదిలితే వాటిప్రభావం మనమీద ఎంతో ఉంటుంది. ' నేను భారతీయుణ్ణి, ' ' ఇది తర తరాలనుంచి వస్తున్న నా సంప్రదాయం ', ' ఇది నా కర్తవ్యం ' అని ప్రతి బాలుడు, బాలిక, ఈ దేశసేవకు తనను అంకితం చేసుకుంటారు.

నిజానికి ఈ దేశంలో ఎందఱో మహానుభావులు, మహాపురుషులు, మహాపతివ్రతలు, మహావీరులు పుట్టి, పెరిగి, చక్కని సంస్కృతికి పునాదులు వేశారు. స్వచ్ఛమైన జీవనవాహినిని మనదాకా ప్రవహింపచేశారు. ఆహా! మనమెంత అదృష్టవంతులం! మన వెనుక ఎంత ఉదాత్తమైన చరిత్ర ఉంది! ఆ పుణ్యపురుషులు, మహాసాధ్వులు ఇక్కడ పుట్టకపోతే మనదిగా

మనం చెప్పుకొనే మహత్తరమైన ఈ సంస్కృతి, సభ్యత మనకెలా సంక్రమించేవి ? వాళ్లను అర్థం చేసుకోవడం, వాళ్ల చరిత్ర మననం చేసుకోవడం, వారి ఆదర్శాలు స్మరించడం కూడ మనకు గొప్ప విజ్ఞానాన్నందించే విద్యాభ్యాసం. అది ముందు ముందు మనజాతి జీవనప్రవాహంలో కొన్ని ఏండ్లదాకా చెక్కుచెదరని స్ఫూర్తిసౌరభాలను విరజిమ్ముతుంది. అందుకే శ్రీనివాసబాలభారతి ఉదయించింది. ఎందఱో మహానుభావుల్ని మీముందుంచుతోంది. ఇక మీదే ఆలస్యం. బాలలూ ! రండి ! రండి !

నిండుమనస్సుతో మీకిదే మా స్వాగతం !

వరలక్ష్మీవ్రతం
22-8-1980

ఎస్. బి. రఘునాథాచార్య
ప్రధానసంపాదకుడు

అప్పుడే పుట్టిన పిల్లవాడు ఎక్కడైనా ఏడవకుండా, కదలకుండా ఉంటాడా? అలా ఉంటే అతడు జీవించినట్లు మనం అంగీకరించం. కానీ ఒకపిల్లవాడు జీవించే ఉండి ఏడవ కుండా, కదలకుండా ఉన్నాడు. ఎంత ఆశ్చర్యం! అంతేనా, చాలారోజులు గడచినా అతను అందఱు పిల్లలలాగా ఉండలేదు. ఒక చింతచెట్టుకింద ధ్యానసమాధిలో నిమగ్నుడై ఉన్నాడు. ఉలకడు, పలకడు. దివ్యతేజస్సుతో ప్రకాశిస్తున్నాడు. ఇప్పు డతడు చిన్నపిల్లవాడు కాదు, పదహారేళ్లువచ్చాయి. ఆ పిల్లవాడికి అరవైఏళ్ల వృద్ధు వినయంతో నమస్కారాలు చేస్తున్నాడు. ఏమిటీ విచిత్రం? ఎవరా మహనీయుడు? ఆయనే నమ్మాళ్వార్. పరాంకుశుడనీ, శఠకోపుడనీ ఆయన్నే అంటారు.

— ప్రధానసంపాదకుడు

# నమ్మాళ్వార్

## దివ్యకాంతిరేఖ

చంద్రుడింకా అప్పటికి వుదయించలేదు. సూర్యుడు అస్తమించి ఎంతోసేపయింది. ప్రొద్దు బాగా వాలిపోయింది. ఆలాంటి సాయంసమయంలో అయోధ్యాపట్టణ పరిసరప్రాంతంలో ధ్యానం ముగించుకొని కళ్ళు తెరిచారు మధురకవి. ఉన్నట్టుండి ఆకాశంలో ఒక దివ్యతేజోరాశి కనిపించింది. మధురకవి ఆ దివ్యతేజోరాశిని తదేకంగా చూశారు. అది క్రమంగా దక్షిణంవేపు కదిలింది. నలువైపులా చూశారు మధురకవి. చుట్టుపక్కల వున్నవారెవరు కూడా ఆ దివ్యతేజోరాశినిగాని, అది దక్షిణం వైపు కదలడంగాని గుర్తించినట్టులేదు. ఆ దివ్యకాంతిరేఖ తన్ను ఆహ్వానించేలా మధురకవికి అనిపించింది. వెంటనే ఆ కాంతిరేఖ వెంబడి అడుగులు వేశారు. ఒకరోజుకాదు, రెండురోజులుకాదు, ఎన్నోవారాలు గడిచాయి, నెలలు కూడా దాటివుంటాయేమో.

పగటి పూట మధురకవి విశ్రాంతి తీసుకొనేవారు. రాత్రి పూట ఆ దివ్యకాంతిని అనుసరిస్తూ కదిలేవారు. దారిలో ఎన్నో క్షేత్రాలు దాటారు చివరకు దక్షిణ దేశంలో తిరుక్కురుగూర్ చేరుకొన్నారు మధురకవి. అంతే

అప్పటి వరకు తనకు మార్గదర్శకంగా వుండే కాంతిరేఖ కనుమరుగయింది. మధురకవికి ఏం చేయాలో ఎటు వెళ్ళాలో అర్థం కాలేదు. కాసేపు ఆగారు.

ఎక్కడా చూడని వింత :

రాత్రి గడచింది. ఉషోదయమయింది. పక్షులు కిలకిలారావం చేస్తున్నాయి. నదీతీరం నుండి చల్లని గాలులు వీస్తున్నాయి. తోటలో వికసించిన పుష్పాలు సువాసల్ని వెదజల్లుతున్నాయి. ఆ గ్రామంలోనివారు తమ తమ పనులు చేసుకోవడానికి కదలి వెళుతున్నారు. మధురకవి నదికేసి వెడుతున్న ఒక వృద్ధుణ్ణి ఆపారు.

"అయ్యా! నేను ఈ వూరికి కొత్తవాణ్ణి. నేను ఎన్నో దివ్యక్షేత్రాలు దర్శించాను. ఎన్నో వింతలు చూశాను. ఈ వూరిలో చూడదగ్గ వింత లేవైనా వున్నాయా! దయచేసి చెప్పండి" అన్నారు మధురకవి.

ఆ వృద్ధుడు మధురకవిని ఎగాదిగా చూశాడు. "అయ్యా మీ మాటలబట్టే మీరు ఈ వూరికి కొత్తవారని తెలుస్తూ వుంది. ప్రపంచంలో మీరెక్కడ చూడని వింత ఈ వూర్లోనే వుంది. అదిగో దూరాన కనిపిస్తుందే ఆ పవిత్ర తింత్రిణీ వృక్షం. ఆ చెట్టు నీడలో పదహారు సంవత్సరాలుగా ఒక చిన్న పిల్లవాడు ధ్యానముద్రలో వున్నాడు. మీరు అక్కడికివెళ్ళి ఆవింతను దర్శించండి" అంటూ వృద్ధుడు నదికేసి నడిచాడు.

మధురకవి ఆ చింతచెట్టును వెతుక్కుంటూ గ్రామంలో అడుగు పెట్టారు. చాల పాతది ఆ చింతచెట్టు. కొన్నివందల ఏండ్లుగా ఎందరికో నీడనిస్తూ వుంది. సాక్షాత్ ఆదిశేషుడే చింతచెట్టు రూపంలో వున్నాడా అన్నట్టు కనిపిస్తుంది. ఆ చెట్టు నీడలో దివ్యతేజోవికాసంతో ఒక పవిత్ర మూర్తి కూర్చొని వుండడం గుర్తించాడు మధురకవి. తానింతవరకు ఆకాశంలో చూచిన కాంతిరాశి చెట్టునీడలో ఆకారం దాల్చినట్టుగా అనిపించింది మధురకవికి. ఆ బాలునిలో చలనం లేదు. దృష్టి మరెక్కడో కేంద్రీకృతమై వుంది. మధురకవికి ఏం చేయాలో తోచలేదు. ధ్యానంలో లీనమయిన వారిని ఎలా పలకరించాలో ఏం మాట్లాడాలో మనసులో ఒక క్షణం మననం చేసుకొన్నారు. మెల్లగా తన ప్రక్కనున్న చిన్న రాయి తీసుకొని దగ్గర్లోనే సద్దు అయ్యేలా జారవిడిచారు.

అంతే! ప్రశాంతమయిన సరోవరంలో ఒక చిన్న కెరటం కదిలినట్లు అయింది. ఆ పిల్లవాడు కళ్ళుతెరచి చూచాడు. మధురకవి తన ప్రయత్నం సఫలమయినందుకు ఎంతో సంతోషించారు.

## నా జన్మ ధన్యమయింది:

మధురకవి సామాన్య వ్యక్తి కాదు. బ్రాహ్మణ వంశంలో పుట్టిన వారు. నాల్గువేదాలు అధ్యయనం చేసినవారు. వేద రహస్యాలు తెలిసిన

వారు. తిరుక్కురుగూర్ చేరేనాటికే మధురకవి అరవైయేళ్ళ పైబడ్డవారు. అందువల్ల కళ్ళు తెరచిన బాలునితో తన ఆధ్యాత్మిక సందేహాన్ని వెలిబుచ్చారు.

"చనిపోయిన దానినుండి సూక్ష్మం పుట్టి ఏం తింటుంది? ఎక్కడ వానం చేస్తుంది?"

అపుడే నోరు విప్పి నమ్మాళ్వార్ "దానిని తింటూ అక్కడే పడి వుంటుంది" అన్నారు.

అంటే ఆత్మ తనది గాని దేహంలో వుంటూ ఆ దేహానికి సంబంధించిన సుఖ దుఃఖాల్ని తనదిగా భావించుకొని కాలం గడుపుతుందని పై వాక్యార్థం. పై మాటలతో మధురకవికి బాలుడంటే భక్తికలిగింది. సాష్టాంగ నమస్కారం చేశారు. శిష్యునిగా స్వీకరించవలసిందని కోరుకున్నారు.

అయ్యా! ఉత్తర భారతదేశమంతా తిరిగాను. రామ రామ అంటూ నోరార పిలిచాను. కృష్ణా కృష్ణా యంటూ కన్నీరుగారుస్తూ బృందావన విహారం చేశాను. నరసింహా నరసింహా అంటూ నాలుక తడి ఆరేలా పాటలు పాడాను. ఈ రోజు మీ దివ్యానుగ్రహంతో నా పుణ్యం పండింది. నా జన్మ ధన్యమయింది. నీవే తల్లివి. నీవే తండ్రివి. నీవే గురుడివి. నీవే నా దైవానివి. నీవే నానర్వస్వం. ఇంతకాలం దారి తెలియకుండా

తిరిగిన నన్ను దగ్గరికి చేర్చావు. అంతే చాలు. నాజన్మ పవిత్రమయింది. అంటూ ఆనందాశ్రువులతో నమస్కారం చేశారు మధురకవి. ఆ బాలుడే నమ్మాళ్వార్.

## నమ్మాళ్వార్ జననాదికం :

నాగరికత నదీతీరంలోనే జన్మించిందని అంటారు చరిత్ర తెలిసిన వారు. ఇది అక్షరాల సత్యం. నైలునదీతీరంలో ఈజిప్టు నాగరికత వెలసింది. వోల్గానదీ తీరంలో ప్రాచీన రష్యా నాగరికత ప్రకాశించినది. సింధునదీ తీరంలో ఆర్యనాగరికత విస్తరించింది. ప్రాచీన హైందవ సంస్కృతి గంగానదీతీరంలో స్థిరంగా నిలిచి పోయింది. పై సత్యాన్ని రుజువుచేసే లాగా నదీతీరంలో ఎన్నో దేవాలయాలు కనబడతాయి. ఎందరో మహా పురుషులు జన్మించడం కనిపిస్తుంది.

ఆలాంటి నదులలో తామ్రపర్ణి ఒకటి. ఆ నదీతీరప్రాంతంలో నవతిరుపతులనే తొమ్మిది వైష్ణవ దేవాలయాలు వున్నాయి. వాటిలో తిరుక్కురుగూర్ ఒకటి. తిరుక్కురుగూర్‌లో వేళాలర్ జాతివారు వున్నారు. వేళాలర్ అంటే కేవలం వ్యవసాయం ప్రధానవృత్తిగా కలవారని ఈ రోజులలో అర్థ వివరణ చెప్పబడుతుంది. కాని వారు పంటలు పండించేవారు మాత్రంకాదు. ఆధ్యాత్మిక క్షేత్రంలో పంటలు పండించే ఆస్తిక జాతి వేళాలర్. వారు

అందరు శాకాహారులు. శ్రీమన్నారాయణ పాదారవింద భజనాసక్తులు. ఈలాంటి వేళాలర్ కులంలో 'తిరువళుదివళనాడర్' అనేవాడు తిరుక్కురుగూర్‌లో వుండేవాడు. వళుది అనడం వల్లనే ఆయన పాండ్యరాజుల సేవకుడని తెలుస్తుంది. అతని కులంలో పుట్టినవాడే నమ్మాళ్వార్.

ఈ రోజులలో మానవజీవితాన్ని బడి, కళాశాల, చలనచిత్రాలు, పత్రికలు నిర్ణయిస్తాయి. కాని ప్రాచీనకాలంలో వ్యక్తి జీవితవికాసాన్ని కులం నిర్ణయించేది. వ్యక్తికంటె ముందుగా తరతరాల సంప్రదాయానికి గౌరవం వుండేది. ఒకరి భక్తినిగాని, ప్రతాపాన్నిగాని, పాండిత్యాన్నిగాని ఆ వ్యక్తి పూర్వీకులబట్టి అంచనా కట్టడం ఆనాటి పద్ధతి. ఆ దృష్టితో చూస్తే నమ్మాళ్వార్ పూర్వీకులు భక్తజనులని, ఆధ్యాత్మికచింతన కలవారని విశదమవుతుంది.

తిరువళుదివళనాడార్, అరంతాంగియార్, చక్రపాణియార్, అచ్యుతర్, సెందామరైకణ్ణనార్, సెంకణ్ణనార్, పొర్కారియార్, కారియార్ మొదలయినవారు నమ్మాళ్వార్ పూర్వం ఏడుతరాలవారు.

పొర్కారియర్ యుక్తవయస్కుడయిన కొడుక్కి వివాహం జరిపించాలని అనుకొన్నాడు. తగిన వధువు కోసం అన్వేషిస్తున్నాడు. తనయిల్లు

మెట్టే అమ్మాయివల్ల తనకులానికి గౌరవం రావాలని అనుకోవడం తప్పేమీ కాదు. అంతేగాకుండ అనుకూల దాంపత్యం కలవార్ని చూచి ఆనందించడం తల్లితండ్రుల అదృష్టం.

తిరుక్కురుగూర్ సమీపంలోనే తిరువణ్పరిసారం అనే తిరుపతి వుంది. ఆ దివ్య తిరుపతిలో వేంచేసిన దేవుడు తిరువాళ్మార్బన్. అమ్మవారి పేరు కమలవల్లి నాచ్చియార్. ఆ గ్రామంలో స్వామి పేరు పెట్టుకొన్న తిరువాళ్మార్బన్ అనే గృహస్థునికి చక్కని చుక్క అయిన అమ్మాయి వున్నట్లు పొర్కారియర్ తెలుసుకున్నాడు. వియ్యంకులు మాట్లాడుకొన్నారు. వధూవరులు సమ్మతించారు. వివాహం వైభవంగా జరిగింది. నూత్న దంపతులు తిరుక్కురుగూర్ నుండి తిరువణ్పరిసారానికి అప్పుడప్పుడు వెళ్ళేవారు. ఆ వూరి మార్గంలోనే తిరుక్కుఱుంగుడి అనే మరొక చిన్న వూరు వుంది. అక్కడ వేంచేసిన స్వామి నంబి.

## మేమే అవతరిస్తాం :

ఒకసారి కారియర్ తన భార్య ఉడైయనంగైతో నంబిని సేవించాడు. తమకు పుత్ర సంతానం ప్రసాదించవలసిందిగా దంపతులు ప్రార్థన చేశారు. 'మేమే అవతరిస్తాం' అని అశరీరవాణి అర్చక ముఖంగా వెలువడింది. దంపతులు ఆశ్చర్యపడ్డారు. స్వామి దివ్యానుగ్రహానికి ఆనందం పొందారు.

తీర్థప్రసాదాలు స్వీకరించి తిరుక్కురుగూర్ చేరుకున్నారు. కొంతకాలానికి ఉడైయనంగై గర్భం ధరించింది. నంబి అనుగ్రహం సత్యమయింది. కౌస్తుభం గర్భస్థ శిశువుపై వింతకాంతుల్ని ప్రకాసింపజేసింది. విష్వక్సేనులవారు భక్తి సామ్రాజ్య స్థాపనకు విజయగీతికలు పలికారు. ఇప్పటికి ఇంచుమించు పదకొండు వందల సంవత్సరాలకు పూర్వం నమ్మాళ్వార్ పుట్టారు.

### చిత్రమైన లక్షణాలు విచిత్రమైన పేర్లు :

నమ్మాళ్వార్ పుట్టినలగాయితు సామాన్య శిశుప్రవృత్తికి భిన్నంగా వుండేవారు. ఏడ్పులేదు. నవ్వులేదు. ఆహారం లేదు. అవయవచలనమూ లేదు. దంపతులు ముందు భయపడ్డారు. ఆ తర్వాత ఆశ్చర్యపడ్డారు. భగవదనుగ్రహాన్ని తలచుకొని దిగులు వదలిపెట్టారు.

పండ్రెండు రోజులు గడిచాయి. పుట్టుసూతకం బిడ్డకు వదలింది. దంపతులు శిశువును తీసుకొని తిరుక్కురుగూర్‌లోని ఆదినాథస్వామి ఆలయానికి వెళ్ళారు. లోకవిరుద్ధమయిన వర్తనం కలిగినవాడు కనుక బిడ్డకు "మారన్" అనే పేరుపెట్టారు. తమిళంలో మారన్ అంటే భిన్నుడని అర్థం. ఆ తరువాత 'దేవా! నీవే బిడ్డకు రక్ష' అంటూ దేవాలయానికి సమీపంలోని చింతచెట్టుకు వుయ్యాల కట్టి బిడ్డను లాలించారు. మారన్ పెరిగాడు. గర్భంలో వున్నంతకాలం బిడ్డకు వున్న పరమాత్మ

జ్ఞానాన్ని శఠమనే వాయువు కప్పివేస్తుంది. కాని మారన్ హూంకారం చేయడంతో ఆ వాయువు నమ్మాళ్వార్ దరికి రాలేదు. అందువల్ల శఠకోపు డయ్యాడు.

సంవత్సరాలు గడిచాయి. పిల్లవానిలో మార్పులేదు. తల్లితండ్రు లెంతో బాధపడ్డారు. పూర్వజన్మంలో తాము ఏతప్పు చేశామో అని అనుక్షణం వ్యసనపడేవారు. కాని స్వామి వరం తలచుకొని మరల వూరుకొనేవారు. విష్వక్సేనుడు స్వయంగా విచ్చేసి తప్తచక్రాంకనాదుల్ని అనుగ్రహించాడట.

కాలం గడచింది. నమ్మాళ్వారుకు లక్ష్మీసమేతుడయిన విష్ణువు గరుడవాహనం ఎక్కినవాడై దర్శనమిచ్చాడు. వివిధ ఆలయాలలో వున్న తన వివిధ రూపాల్ని నమ్మాళ్వార్‌కు సాక్షాత్కరింపజేశాడు. అపుడే ఆళ్వారు దివ్యపాశురాలతో శ్రీమన్నారాయణుని కీర్తించాడు.

తిరువిరుత్తం, తిరువాసిరియం, పెరియతిరువందాది, తిరువాయ్ మొళి అనే గ్రంథాల్ని నమ్మాళ్వార్ వ్రాశాడు. ఋగ్యజుస్సామాధర్వ వేదాల సారాన్నంతా తమిళంలో పై గ్రంథాలలో పేర్కొన్నాడు. అందువల్ల 'వేదాన్ని తమిళం చేసిన మాఱన్' అని పండితులు పొగుడుతుంటారు.

పొలిందునిన్ద్రపిరాన్ అనే ఆదినాథస్వామి మెచ్చి వకుళమాలను నమ్మాళ్వార్‌కు ఇచ్చాడట. అందువల్ల వకుళాభరణుడని కూడా పేరు కలిగింది.

తన కాలంలో వుండే అవైదికమతాల్ని నమ్మాళ్వార్ వాదనలతో వోడించాడు. అందువల్ల పరమతాలనే ఏనుగుల్ని తన వాదన అనే అంకుశంతో అణచినవాడు అనే అర్థంలో పరాంకుశన్ అని కూడా నమ్మాళ్వారును పిలుస్తారు.

నమ్మాళ్వార్ ప్రసిద్ధి దేశదేశాలు ప్రాకింది. ఎందరోభక్తులు వచ్చి సేవించారు. సామాన్యజనులు నమ్మాళ్వార్ కరుణాకటాక్షంతో ధన్యులయ్యారు. తాత్త్వికులు వేదాంతరహస్యాలను నమ్మాళ్వార్ వల్ల తెలుసుకొన్నారు. చింతచెట్టుక్రిందనే ధ్యానంలో కాలం గడుపుతూ నమ్మాళ్వారు తన 35 వ సంవత్సరం వైకుంఠం చేరుకున్నారు. మధురకవి తమ గురువుకు ఆ చింతచెట్టుదగ్గరే విగ్రహప్రతిష్ఠ చేసి ధన్యులయ్యారు.

నాథముని ఆగమనం :

వైష్ణవమతాన్ని ప్రచారం చేసిన ఆచార్యులలో నాథముని ఒకరు వారు ఉత్తరభారతదేశమంతా పర్యటించి స్వగ్రామమైన వీరనారాయణపురం చేరుకొన్నారు. ఆ వీరనారాయణపురానికి అపుడే తిరుక్కురుగూర్ నుండి

వైష్ణవ భక్తులు కూడా వచ్చేశారు. వారు భక్తిపారవశ్యంతో తిరువాయ్‌మొళి పాశురాలను పాడారు. నాధమునులు అప్పటిదాకా ఆ పాశురాలను వినివుండలేదు. ఆ పాటలకు, పాటలలోని సాహిత్యానికి నాధమునులు ఎంతో ముగ్ధులయ్యారు. ఆ పాటలన్నీ కుంభకోణంలో వేంచేసిన శార్ఙ్గపాణి దేవునికి సంబంధించినవి.

వైష్ణవభక్తులు పాశురాలు పాడి ముగించిన తర్వాత నాధమునులు :

"భక్తులారా! ఈ పాటలెవరు రచించారు. మీరు పది పాశురాలు మాత్రం పాడారు. ఈ పాటలు వెయ్యిదాకా వున్నట్టున్నాయి. ఆ పాటలన్నీ పాడగలిగినవారు ఎవరు? దయచేసి చెప్పండి" అన్నారు.

"అయ్యా! మేము తిరుక్కురుగూర్ వాస్తవ్యులం. అక్కడే ఈ పాటలు విన్నాం. మీరు కూడా తిరుక్కురుగూర్ వెళితే తప్పక ఆ పాటలు వినవచ్చు".

నాధమునులు తిరుక్కురుగూర్ వెళ్ళారు. అక్కడ ఎందరినో ఆపాటలు గురించి అడిగారు. లాభం లేకపోయింది. చివరకు ఒక వైష్ణవుడు :

"అయ్యా! ఈ గ్రామంలో పరాంకుశదాసర్ అనే వృద్ధులున్నారు. వారిని అడగండి. మీకేదైన ప్రయోజనం కలగవచ్చు".

చీకటిలో తచ్చాడే వ్యక్తికి కాంతిరేఖ కనిపిస్తే కలిగే సంతోషం నాథమునులకున్ను కలిగింది. పరాంకుశదాసులవారిని నాథమునులు దర్శించి తమ రాక ఆంతర్యం తెలియజేశారు.

" అయ్యా ! నాకు కూడా ఆ పదిపాటలే వచ్చు. మీరు ఆ పాటల్ని మనసారా పాడండి. నమ్మాళ్వార్‌ను ధ్యానం చెయ్యండి. మీ కోరిక నెరవేరవచ్చు " అన్నారు.

నాథమునులు పరాంకుశదాసర్ చెప్పినట్లు పదిపాశురాలను భక్తితో గానం చేశారు. నమ్మాళ్వార్‌ను నిశ్చలభక్తితో ధ్యానం చేశారు. నమ్మాళ్వార్ ప్రత్యక్షమై ఇతర పాశురాల్ని నాథమునులకు అనుగ్రహించారు.

ఈ విధంగా కాలగర్భంలో అణగిన నమ్మాళ్వార్ రచనలు మరల వెలుగులోనికి వచ్చాయి.

**నమ్మాళ్వార్ కృతులు :**

నమ్మాళ్వార్ విరచించిన కృతులు నాలుగు. అవి తిరువిరుత్తం, తిరువాశిరియం, పెరియతిరువందాది, తిరువాయ్‌మొళి.

**తిరువిరుత్తమ్ :**

విరుత్తమనే ఛందస్సులో వ్రాయబడడంవల్ల తిరువిరుత్తం అని పేరు. తిరు అంటే తమిళంలో 'శ్రీ' అని అర్థం. నాలాయిర దివ్యప్రబంధంలో

మూడవ సహస్రంలో ఇయర్పా అనే భాగంలో తిరువిరుత్తం చేరి వుంది. ఇందులో 100 పాశురాలు వున్నాయి. అన్నీ అంతాది రచనలే.

నాలాయిర దివ్యప్రబంధంలోని మూడవ సహస్రం చరమశ్లోకాన్ని గురించి చెబుతుంది. చరమశ్లోకమంటే భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు చెప్పిన వేదాంతసారభూతమైన చివర శ్లోకమన్నమాట. జీవుల్ని భగవంతుని యందు విశ్వాసముంచి ఆత్మార్పణం చేసుకొమ్మని చెప్పడమే చరమ శ్లోకార్థం. ఈ భావాన్నే తిరువిరుత్తం చెబుతుంది. కిడాంబియాచ్చన్ అనే భక్తుడు తిరువిరుత్తం ప్రాశస్త్యాన్ని ఈ విధంగా చెప్పాడు.

"పుడుతూ పెరుగుతూ కోరికలతో క్రుంగుతూ ముసలివారయి ఆ తరువాత బాధపడే మానవులారా! మీ కోరికలనన్నింటిని తీర్చి ముక్తిని ప్రసాదించడానికి కురుగై నాయకుడయిన నమ్మాళ్వార్ పాడిన తిరువిరుత్తంలోని ఒక పాదాన్ని అర్థం చేసుకొని పాడండి."

తిరువాశిరియం :

ఆశిరియప్పా అనే ఛందస్సులో వ్రాయడం వల్ల 'తిరువాశిరియం' అనేపేరు. 79 పాదాలు వున్న లఘు గ్రంథం. ఈ గ్రంథం గురించి

ఎంబెరుమానార్ :

"లోకంలోని జీవరాసులంతా ధన్యులు కావడం కోసం భూలోకంలో పుట్టి, ఆశిరియప్పా ఛందస్సులో వేదవేదాంత రహస్యాల్ని విశదీకరించి చెప్పిన ఆచార్యుని, పరాంకుశుని, వకుళాభరణుని పవిత్రమైన మనస్సులో భావించి ఎప్పుడు మరువకుండా స్తుతించెదముగాక" అని ప్రస్తుతించారు.

పెరియతిరువందాది :

87 వెణ్బా ఛందస్సులో వ్రాయబడ్డ కృతి. ఒక పాశురం కడపటి శబ్దం ఆ తరువాతి పాశురం మొదటి శబ్దంగా స్వీకరించి వ్రాయడంవల్ల ఇది పెరియతిరువంతాదిగా పిలువబడింది. విశిష్టాద్వైత మతస్థాపకులు రామానుజులు ఈ గ్రంథాన్ని బహుధా ప్రశంసించి వుండడంవల్ల ఈ గ్రంథప్రాశస్త్యం రుజువవుతుంది.

తిరువాయ్ మొళి :

నాలాయిర దివ్యప్రబంధంలో నాల్గవ సహస్రంగా నిలచిన భాగం తిరువాయ్‌మొళి. ఇది నాలాయిర దివ్యప్రబంధానికే కిరీటం లాంటిదని కొందరి అభిప్రాయం. దీనినే భగవద్విషయమంటారు. సామవేదసార మంటారు కొందరు. భక్తిపాటలంటారు భాగవతశిరోమణులు. ద్రవిడ వేదమంటారు తమిళపండితులు.

రామానుజులు, ఆయన తరువాత వెలసిన ఆచార్యులు తిరువాయ్ మొళికి ఎన్నో వ్యాఖ్యానాలు వ్రాశారు. వాటికి ఆరాయిరప్పడి, పన్నీరాయిరప్పడి, ఇరువత్తునాలాయిరప్పడి లేక ఈడు అనే పేర్లు వున్నాయి. ఆచార్య హృదయమనునది తరువాత వ్రాయబడిన వ్యాఖ్య.

శ్రీరంగనాథస్వామిని గూర్చి సహస్రం వ్రాసిన తిరువాయ్‌మొళికి తల్లి శఠకోపుడు. ఎత్తి పెంచినవాడో రామానుజుడని తిరువాయ్‌మొళిప్రాశస్త్యాన్ని పెద్దలు చెబుతారు.

## ఆళ్వారులలో నమ్మాళ్వార్:

దైవజ్ఞానంలోను, ప్రేమలోను, ఆనందంలోను మునిగినవారిని ఆళ్వారులంటారు. ఆళ్వారులు 12 మంది అని అంటారు వైష్ణవ సంప్రదాయం అనుసరించేవారు. ఈ పన్నిద్దరు కూడా విష్ణుమూర్తి అనుచరగణమే ఆదిశేషుడు, గరుడుడు మొదలయిన అనుచరులు, శంఖం చక్రం మొదలయిన పరికరాలు పన్నిద్దరాళ్వారులై అవతరించారని వైష్ణవుల విశ్వాసం.

నమ్మాళ్వార్ ఆత్మఅని, మొదటి ముగ్గురు ఆళ్వారులు మనస్సని, తక్కిన ఆళ్వారులు దేహమని వైష్ణవసంప్రదాయము. దీనినే మరికొందరు మరొకవిధంగా చెబుతారు. పూదత్తాళ్వార్ శిరసట. పాయ్‌గైఆళ్వార్,

పేయాళ్వార్ కన్నులట. పెరియాళ్వార్ ముఖమట. తిరుమళిశైఆళ్వార్ మెడఅట. కులశేఖరాళ్వార్, తిరుప్పాణాళ్వార్ చేతులట. తొండరడిప్పొడి ఆళ్వార్ రొమ్మట. తిరుమంగైఆళ్వార్ పొక్కిలి. మధురకవి పాదమట. ఇతర ఆళ్వార్లు అవయవమయితే నమ్మాళ్వార్ అవయవిగా ప్రతీతి.

పుట్టుక నుండే బ్రహ్మజ్ఞానసంపన్నులుగా రాణించడం నమ్మాళ్వార్ ప్రత్యేకత. ఇతర ఆళ్వార్లు యాదృచ్ఛికంగా భక్తి ప్రధానపడి రాణించినవారు.

ఆచార్య అనే బిరుదు నమ్మాళ్వారుకే వుంది. ఇతరులకు లేదు.

పుట్టినప్రదేశం కారణంగా కొందరికి ప్రశస్తి. అలా గాకుండా తమ జన్మవల్ల వూరికే గౌరవం సంపాదించి పెట్టేవారు కొందరు. అలాంటి వారిలో నమ్మాళ్వార్ ఒకరు. ఆ మహాపురుషుని జన్మవల్లనే తిరుక్కురుగూర్ అనే గ్రామం ఆళ్వార్ తిరునగరిగా ప్రసిద్ధిపొందింది. తమిళదేశంలో తిరునెల్వేలి తిరుచ్చెందూర్ రహదారిలో ఈ గ్రామం వుంది.

## నమ్మాళ్వార్ — శ్రీవేంకటగిరి :

నమ్మాళ్వార్ ధ్యానంలో దివ్యతిరుపతులను దర్శించినాడని ప్రసిద్ధి. లక్ష్మీసమేతుడయిన విష్ణువు వాహనం ఎక్కి వివిధ ఆలయాలలో వున్న వివిధ రూపాలతో నమ్మాళ్వార్కు దర్శనమిచ్చాడని అంటారు. వైష్ణవులకు 108

తిరుపతులు ముఖ్యమైనవి. వాటిలో శ్రీరంగం, కాంచీపురం, తిరుపతుల ఇంకా ప్రచారం వహించినవి. ఈ మూడు వైష్ణవమతానికి మట్టిపూడలని చెప్పవచ్చు. పన్నిద్దరు ఆళ్వారులలో తొండరడిప్పొడి ఆళ్వారు, మధురకవి ఆళ్వారు మినహా తక్కిన పదిమంది ఆళ్వార్లు శ్రీవేంకటాచలపతికి మంగళా శాసనాలు చేసినవారే. వారిలో ఎక్కువ పాశురాలను పాడినవారు నమ్మాళ్వార్.

శ్రీవైష్ణవ సిద్ధాంతాల ప్రకారం నారాయణుడే పరమప్రభువు. సమస్త కళ్యాణగుణాలకి నిలయుడు. మంగళధాముడు. అతడే సృష్టికి స్థితికి లయానికి కారకుడు. ఆ నారాయణుని వివిధ నామరూపాలతో భజిస్తున్నాం. కాని ఏ పేరుతో ధ్యానించినా ఏ రూపంతో సేవించినా అవన్నీ నారాయణునికే చెందుతాయి.

నమ్మాళ్వార్‌కు కృష్ణుడే అభిమానదేవత. మధురభావమే అతని అభిమాన సాధన. జీవాత్మ భగవంతుని వధువు. భగవదత్త ఆత్మకు ఆహారపానీయాలు. అతడే ఆత్మకు ఆనందం ఇచ్చేవాడు. భక్తికి పరమోత్కృష్ట తార్కాణం బృందావన గోపికలు. వారి మార్గాన్ని అవలంబించే భక్తునికి కృష్ణసాంగత్యం తప్పక లభిస్తుంది. కృష్ణవియోగంవల్ల భక్తుడు కృశించిపోతాడు. భక్తుని ప్రేమకోసం భగవంతుడు పరితపిస్తాడు. ఇదే నమ్మాళ్వార్ దివ్య ప్రేమానుభూతి మార్గం.

ఆ యా క్షేత్రాలలోని స్వామి ఆకారవర్ణనలతో నమ్మాళ్వార్ తృప్తి పడలేదు. నాయికగా, చెలికత్తెగా, తల్లిగా నాయకుణ్ణి ఆరాధిస్తూ ఎన్నో పాశురాలు వ్రాశారు నమ్మాళ్వార్. వాటిలో కొన్నిటిని పరిశీలిద్దాం.

"చెలికత్తెలారా! మీకు ఏమీ కనపించలేదా? నిదానించి చూడండి. పరాకు వదలిపెట్టి తీక్షణంగా పరిశీలించండి. అదిగో నాస్వామి శ్రీ వెంకటేశ్వరుడు సంపదలు ఆర్జించడానికోసం దేవతలు కూడా నివసించాలని కోరే వెంకటగిరివైపు కదిలాడు. జాగ్రత్తగా పరిశీలించండి"

"ఓ మబ్బులారా! ఎందరినో అడిగాను. వేడుకొన్నాను. కాని నా దేవునిదగ్గరికి ఎవరున్నూ దూతగా వెళ్ళలేదు. మీరు నవరత్నాలు వెదచల్లినట్టుండే తిరుమలకు వెళుతున్నారని అనుకొంటాను. మీరుకూడా అచ్చం ఆ కొండలాగే వున్నారు. అందువల్ల మీరు అక్కడికి వెళ్ళడం సబబు. అయినా నా కోసం మీరు వెళ్ళరూ!"

గలగలా రవళిచేసే గాజులు తొడుక్కొన్న చెలికత్తెలారా! మీకే మాత్రం చీకూ చింతా లేదు. నన్ను చూడండి. బాగా చిక్కిపోయాను. నా గాజులు వదులై క్రిందికి పడేలా వున్నాయి. ఆ వెంకటేశ్వరుని కోసం వెదకుతూ వెళ్ళిన నా దుస్థితి చూశారా!

ఓ తిరుమలవాసా! మా అమ్మాయిని ఏం మాయం చేశావు? ఇం:
ఆవిడ శారీరకంగా ఎదగనే లేదే. పావడా కట్టుకోవడం కూడ చేతకాద
ఇంకా బుజ్జి బుజ్జి మాటలే పలుకుతుంది అమ్మాయి. అయినా ఎప్పుడు
తిరుమలవాసుడంటూ ప్రలపిస్తున్నదే. ఒకసారి ముల్లోకాలు కొలిచినవాడ
అంటుంది. మరోసారి నీలమేఘశ్యాముడా అంటుంది. ఇంకోసారి ఎఱ్ఱదామ
లాంటి కళ్ళు కలవాడా అంటుంది. ఇలా ప్రలపిస్తూ నిన్ను తలుస్తు
క్రుంగి కృశిస్తూ గాజులు వదులుఅయ్యేలా నన్నబడి దిగాలువడిపోయింది.

" ఈ తిరుమల సామాన్యమైంది కాదు. సర్వేశ్వరునికే భోగస్థానం.
అంతేకాదు ద్రవిడదేశానికే తిలకం లాంటిది. అలాంటిచోట వైష్ణవభక్తులతో
కూడి నన్ను ఎందుకు బాధపెడుతున్నావో చెప్పు. నా బాధ నీకు అర్థం
కాదు. నేను చెప్పినా విననట్టు వూరుకొంటున్నావు. నా మనస్సు నీ అండనే
కోరుతుంది. ఎంతవద్దనుకొన్నా నీవైపే లాగుతున్నది. నన్ను ఇంతగా
ఆకర్షిస్తున్నావే. ఏమిటి నీలో ఆకర్షణ? ఇంకా చూడాలనిపించే ముఖ
సౌందర్యమా! కాకపోతే వింటూ వుండాలనే మాటల తీపిదనమా? లేకపోతే
అమృతమయమయిన మాటల్ని వుచ్చరించే ఆ పెదవుల అందమా! నాకేమీ
అర్థంకావడంలేదు. దేవా! నీవే చెప్పు" అంటూ భక్తుడు దేవుణ్ణి ఆకర్షణకు
లోబడి ప్రార్థిస్తున్నాడు.

ఒక నాయిక వుంది. ఆమె చెలికత్తెలతో కలిసి నాయకుని కోసం ఎంతోకాలం నిరీక్షించింది. కాని ప్రయోజనం సున్న. అందువల్ల నాయిక విసిగిపోయింది. ఆ కారణంగా నాయకుడంటేనే కోపం పెంచుకొంది. ఈ దృశ్యాన్ని మనోహరంగా వర్ణించాడు నమ్మాళ్వార్.

అయ్యా! మీరు ఏనుగును వెతుక్కొంటూ వచ్చారు. కాని అది కనబడలేదు. కనబడకపోతే మాట్లాడకుండా తిరిగి వెళ్ళడం సజ్జనుల లక్షణం. కాని మీరు అలా చేయలెదు. మా నాయికను చూశారు. ఆవిడ కళ్ళని ఆ కళ్ళ అందాన్ని వర్ణిస్తున్నారు. ఎవరయినా మీరు అలా వర్ణించడాన్ని వింటే ఏమనుకొంటారు. అదీగాకుండా సముద్రాలలో వున్న నీటినంతా పీల్చిన కాలమేఘంలాగా వుండే కొండలో ఎంతో కాలం వేచి వున్నప్పుడు పలుకలేదే. మీకు మాకు సంబంధం ఏమాత్రంలేదు. మీరు ఇక దయచేయవచ్చు."

ఈలాగే నమ్మాళ్వార్ చిత్రీకరించిన మరొక దృశ్యం చూద్దాం.

ఒక నాయిక వుంది. నాయకుణ్ణి చూచింది. మరులుగొంది. కాని నాయకుడింకా నాయికను చేరదీయలేదు. ఆలోగా నాయికకు విరహావస్థలు పెరిగినాయి. ఈభావాల్ని భక్తునికి ఆపాదించి ఒక సుందరమైన చిత్రాన్ని గీశారు నమ్మాళ్వార్.

నాయిక విరహాగ్ని కారణంగా తపిస్తుంది. అందువల్ల దేహం బాగా శిథిలమైపోయింది. నాయికకు వున్న అసలు దుఃఖం తెలుసుకోకుండా ఇంకా అనర్థాలయిన చేష్టలు చేయడం సబబు కాదు. ఎరుకలసానులెక్కడ? వారి వైద్యమెక్కడ ? అంతేకాదు తల్లే తెలిసి తెలిసి కూతురుకి ఈలాంటి చికిత్సలు చేయడం సరికాదు. మొదటికే మోసం వస్తుందేమో. అందువల్ల ఈవిడను తిరుమలకు తీసుకొని అక్కడ పడవేయడమే మంచిది.

## నమ్మాళ్వార్ - అన్నమయ్య :

ఆంధ్రవాగ్గేయకారులలో అన్నమయ్యను పదకవితాపితామహుడుగా చెప్పడం పరిపాటి. రోజుకు ఒక్క కీర్తన వంతున తుదిశ్వాస వదిలే వఱకు 32 వేల కీర్తనలు వ్రాసినవాడు అన్నమయ్య. వైష్ణవ సంప్రదాయం తమిళంలో వ్రాయబడ్డ నాలాయిర దివ్యప్రబంధాలకు ఇచ్చే విలువను గుర్తించి తాను కూడా తెలుగులో ఆ దివ్య ప్రబంధాలను అనుసరిస్తూ ఎన్నో కీర్తనలు వ్రాశాడు. నమ్మాళ్వార్ పాశురాల అర్థాలు అన్నమయ్య కీర్తనలలో చాల వాటిల్లో కనిపిస్తాయి కూడా.

నమ్మాళ్వార్ తిరువాయ్‌మొళిలో సెలయేళ్ళతో ప్రకృతి సౌభాగ్యంతో ప్రకాశించే తిరుమలను అందలి స్వామిని 'ఒళవికకాలమెల్లామ్' అనే పాశురంలో కీర్తించాడు. అన్నమయ్య ఇంచుమించు అదేమోస్తరు :

"కట్టెదుర వైకుంఠము కాణాచయిన కొండ
తెట్టలాయ మహిమలే తిరుమల కొండ
వేదములె శిలలై వెలసినది కొండ
ఏదెస పుణ్యరాసులే యేరులైనది కొండ
గాదిలి బ్రహ్మాది లోకముల కోనల కొండ
శ్రీదేవుఁడుండేటి శేషాద్రి యీ కొండ" అని అన్నాడు.

నమ్మాళ్వార్ తిరువాయ్‌మొళిలో వరప్రసాదమయిన కవితను నరస్తుతికి వినియోగించకూడదు. అది భగవంతుణ్ణి స్తుతించడానికే అంకితం కావాలని నిర్దేశించారు. అన్నమయ్య కూడా ఈ అభిప్రాయాన్నే :

"చెలగి నాకిందుకే చింతయ్యీని
తెలిసినదాకా నిది దిష్టమయ్యీనా

హరిపుట్టించినదేహి హరినే కొలువక
పరుల గొల్చుట అన్యాయమయ్యీ
గరిమ నేరుగుడిచి కాలువఁబొగడఁబోతే
యెరవెరవే కాక యీతవయ్యీనా" అన్నాడు.

నమ్మాళ్వార్ ఆ తిరువాయ్‌మొళిలో హరిభక్తి లేని బ్రాహ్మణుని కంటే చండాలుడు మేలన్నాడు. ఆ చండాలుడే హరిభక్తిగలవాడయితే అతడే పూజనీయుడన్నాడు. ఈ అభిప్రాయాన్నే అన్నమయ్య :

"కొంచెమును ఘనముగను గొననేల హరిదలచు
పంచమహాపాతకుడైన బ్రాహ్మణోత్తముడు

పరమమగు వేదాంతపఠన దొరికియు సదా
హరి దలచలేని సన్యాసి కంటె
మరిగి పసురముఁదినెడి మాలయైనను వాఁడె
పరమాత్ముఁ గొలిచినను బ్రాహ్మణోత్తముడు" అన్నారు.

వైష్ణవమతంలో భగవద్భక్తి కంటె ఆ భగవంతుని సేవించే దాసులకు దాసులై వుండడం శ్రేష్ఠంగా భావింపబడుతుంది. నమ్మాళ్వార్ తన పాశురాలలో చాలవాటిలో దాసదాస్యభక్తిని ప్రదర్శించారు. అన్నమయ్య కూడా అలాగే:

"అచ్యుత మిమ్ముఁ దలచేయంత పనివలెనా
యిచ్చల మీవారే మాకు నిహపరాలియ్యగా

అంది నీకు భక్తులైన అల మహానుభావుల
చందపు వారిపై భక్తి చాలదా నీకు
కందువ శ్రీ వేంకటేశ కడునీబంటు బంటుకు
సందడి బంట నవుటే చాలదా నీకు" అన్నాడు.

శ్రీ వేంకటేశ్వరుడు విష్ణువా? శివుడా? జనదేవుడా? శక్తియా అని అనేక సంశయాలు వున్నాయి. కాని కొలిచేవారి దృష్టిలో అతడు విష్ణువే, శివుడే, శక్తిస్వరూపమే. ఆళ్వారులలో నమ్మాళ్వార్ సేవించే వారిని బట్టి స్వామి ఆ యా రూపాలలో గోచరిస్తాడని అంటే అన్నమాచార్యులు కూడా

"ఎంతమాత్రమున నెవ్వరు దలచిన నంతమాత్రమే నీవు
అంతరాంతరము లెంచిచూడ (బిండంతే నిప్పటియన్నట్లు

కొలుతురు మిము వైష్ణవులు కూరిమితో విష్ణుండని
పలుకుదురు మిము వేదాంతులు పరబ్రహ్మమనుచు
తలతురు మిము శైవులు తగిన భక్తులును శివుడనుచు
అలరి పొగడుదురు కాపాలికులు ఆదిభైరవుడనుచు
నీవలన కొఱత లేదు మఱి నీరుకొలది తామెరవు
ఆవల భాగీరథి దరి బావుల నీ జలమే వూరిన యట్లు
శ్రీవేంకటపతి నీవైతే మము చేకొనే వున్న దైవమని
యీవలనే నీ శరణనియెద నిదియే పరతత్త్వము నాకు."

"భగవంతుని సేవించండి. అతనికి ఆత్మార్పణం చేసుకొండి. అతని ఘనతను పొగడండి. అతని నామాన్ని జపించండి. మిమ్మల్ని అతడు రక్షిస్తాడు. కాపాడతాడు" అనడమే నమ్మాళ్వార్ సందేశం.

నమ్మాళ్వార్ మన అందరికి మార్గం చూపించే దివ్యకాంతిరేఖ.

---

